# శ్రీనిమిషాంబా సుప్రభాతమ్

**నిమిషేఽ నిమిషే! మాత(-)**
**రున్మేషాదృత సర్జనే ।**
**నిమిషే నిమిషేఽస్మాకం**
**రక్షాయై జాగృహీశ్వరి!**

తల్లీ! నిమిషాంబా! నీవు నిమిషం (అనగా రెప్పపాటు) లేని దానివి. నీ కళ్ళు తెరిపిడివల్ల నీవు సృష్టి క్రియను ఆదరిస్తున్నావు. ఓ ఈశ్వరీ! అట్టి నీవు మాకు ప్రతి నిమిషమూ రక్షణ కలిగించేందుకై మేలుకో తల్లీ!

**శ్రీముక్తికేశ్వర! విముక్త సమస్తంగ!**
**సంగీ భవాన్ భవతి భో నిమిషాంబయైవ**
**సాంబ! ప్రతీక్షణపరా నిమిషాళిమేతా(-)**
**మున్మేషకేలికలయా రమయాద్య భూమన్!**

శ్రీముక్తికేశ్వరా! నీవు సంగాలన్నింటినీ వదిలినవాడివి. కానీ నీకు ఒక నిమిషాంబతో మాత్రం నిత్యసంగం వుంది. అందువల్లే నీవు సాంబుడవు. (అంబతో కలిసి వున్నవాడవు.) హే భూమన్ (అనగా ఓ సర్వవ్యాపి అయిన పరతత్త్వమా!) ఈ అనిమిషాళి (అనగా రెప్పపాటు లేని దేవతలు) నీకై యెదురు చూస్తున్నారు. నీయొక్క రెప్పలెత్తటమనే క్రీడలోగల అందంతో వారిని ఇపుడు ఆనందింపజేయి.

1. **ధ్యాత్వాంబ! భానురరుణాం భవతీం నిశాయాం**
**ప్రాప్తారుణాకృతిరివాద్య సమేతి మందమ్ ।**
**త్వాం దర్శయన్నివ జనాయ తమీశి! పశ్య**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

అమ్మా! సూర్యుడు రాత్రంతా అరుణాస్వరూపిణివైన నిన్ను ధ్యానించి (తాదాత్మ్యభావనవల్ల) తనే అరుణాకారాన్ని పొందినట్లుగా వుంది. ఇపుడు ఆ యెర్రని ఆకారంతోనే మెల్లగా వస్తున్నాడు. అతడలా వస్తుంటే, అతడు జనానికి నిన్నే దర్శనం చేయిస్తున్నాడన్నట్లుగా వుంది. ఓ ఈశపత్నీ! అతన్ని చూడు, చూసి, నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చేయుదువుగాక.

2. **దేవ్యాస్తవాద్య ఖతలీ ప్రథమప్రపూజా-**
**లుబ్ధేవ వర్షతి సమస్తదిశాసు పశ్య ।**
**హారిద్రకుంకుమపటీరవిచిత్రధూళిం**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

నా తల్లీ! నిమిషాంబా! ఇపుడీ ఆకాశం దేవివైన నీకు మొదటి పూజ తనే చెయ్యాలని ఆశపడుతోందల్లే వుంది. అందుకే దిక్కులలో పసుపు, కుంకుమ, పచ్చకర్పూరము కలిపిన రంగురంగుల చూర్ణాన్ని వర్షింప చేస్తోంది. చూడు, చూసి ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

3. **పూజాసుమార్థమభితో విహితా వనీయం**
**ప్రాతస్సమీరణసమీరితశీర్షదేశా ।**
**ఫుల్లత్సుమస్మితముఖీ నమతీవ దూరాత్**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

పూజా పుష్పాలకోసం నీ గుడి చుట్టూతా ఏర్పరచిన యీ పూలతోటను ప్రభాత వాయుదేవుడు వచ్చి ప్రేరేపిస్తున్నాడు. దానితో ఆ వనదేవత తలను కదులుస్తూ, ఇపుడిపుడే వికసిస్తున్న పుష్పాలనే నెపంతో చిరునవ్వు నవ్వుతూ, వంగి నీకు దూరం నుంచే నమస్కరిస్తున్నట్లుగా వుంది. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

4. **కావేరికాసమవగాహనయోగపూతః**
**ఉద్ధూళితోర్ధ్వవికసత్సుమజైః పరాగైః ।**
**పూజార్థమద్య వినయాదుపయాతి వాయుః**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఇపుడే వాయుదేవుడు కావేరీనదిలో స్నానమనే యోగంవల్ల పవిత్రుడై, ఇపుడిపుడే వికసిస్తున్న పూలలోని పుప్పొడులను పైనుంచీ కిందకి భస్మోద్ధూళనం చేసికొని, నీ పూజకోసం వినయంగా (అంటే, మెల్లగా) వస్తున్నాడు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

5. **గావోऽ ద్య గోపవనితాగలభక్తిగీతీ-**
**సంబోధితాస్త్వదభిషేకకృతే మహేశి! ।**
**క్షీరం ఘటేష్వమృతసన్నిభముత్సృజన్తి**
**కుర్యా! మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఓ మహేశీ! ఇపుడే గోపస్త్రీలు పాడే భక్తిగీతాలవల్ల జ్ఞానం పొంది, నీ అభిషేకం కోసం కుండలలోకి అమృతం వంటి పాలను ఆవులు, నింపుతున్నాయి. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

6. **కాలానుకూలకలితోజ్జ్వలకాకలీకా**
**ఏతే ద్విజాస్సుమహితశ్రుతిసమ్మతిజ్ఞాః ।**
**త్వన్నామపాఠముఖరా ఇవ భాన్తి భద్రే!**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఈ పక్షులకు శ్రుతి సమ్మతంగా వుండేటట్లు (అనగా చెవికి, సంగీత శ్రుతికి కూడా సమ్మతంగా వుండేటట్లు) కూయటం తెలుసు. అందుకే అవి ప్రభాతకాలానికి ఉచితమైన, ఉజ్జ్వలమైన, అవ్యక్తమధురమైన, సన్నని, ధ్వనులను కలుగజేస్తున్నాయి. అందుకే అవి గొంతెత్తి నీ నామకీర్తన చేస్తున్నట్లుగా వుంది. మంగళ ప్రదురాలవైన నా తల్లీ! నిమిషాంబ! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

**రెండవ అర్థం-** ఈ ద్విజులకు కాలానుకూలమైన ఉజ్జ్వలమైన, అవ్యక్తమధురమైన, సన్నని, కంఠస్వరం వుంది. వీరికి వేదం దేన్ని సమ్మతిస్తుందో అది గూడా తెలుసు. వారు వేదగానం చేస్తుంటే, నీ నామకీర్తన లాగానే వుంది. మంగళ ప్రదురాలవైన నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

7. **వేదానువాకనిరతా నిగమేశి! వేద-**
**విద్యార్థినో గురుగృహేషు విధూతనిద్రాః ।**
**త్వత్కీర్తిమద్య బహుధా ప్రథయన్తి శాన్తే!**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

వేదశాస్త్రాలకు అధిపతివైన తల్లీ! ఈ వేద విద్యార్థులు నిద్రను దులిపివేసికొని, గురువుగారి ఇంట్లో వేదానువాకాలను వల్లిస్తూ ప్రశాన్తరూపిణివైన నీ కీర్తిని దిక్కులలో విస్తరింప చేస్తున్నారు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

8. **గాఢం నిమేషముషితోఽస్తి సమస్తలోకః**
**ఉన్మేషవానపి శివే! నయనద్వయేన ।**
**త్వం త్ర్యంబకాసి సతతానిషాపి చాసి**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఈ లోకంలో ప్రతివాడికీ రెండు కళ్లు వున్నాయి. వాడవి తెరుచుకొనే వుంటాడు. అయినా వాడు రెప్పపాటులో గాఢంగా మునిగిపోయే వున్నాడు. హే శివే! నీకు మూడు కళ్లున్నాయి. నీవు ఎప్పుడూ కళ్లు తెరుచుకునే వుంటున్నావు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

9. **నిద్రా త్వమేవ హరినేత్రపుటే పురాభూః**
**నిద్రా చ దైత్య నిచయేషు తమస్స్వరూపా ।**
**భద్రాసి భక్తహృదయేఽద్య విహాయ నిద్రాం**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

తల్లీ! పూర్వం (మధుకైటభ వధ సన్నివేశంలో) నీవు శ్రీహరి నేత్రాలలో నిద్రవై నిలిచావు. నీవు ఇప్పటికీ రాక్షస హృదయాలలో తమోగుణరూపమైన నిద్రగా వున్నావు. భక్తుల హృదయాలలో మాత్రం నీవు భద్రవుగా (మంగళప్రదవుగా) వున్నావు. అట్టి నీవు ఇపుడు నిద్ర వదిలి, నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

10. **ఉద్బోధ్య యా కిల హరిం విధిరక్షణాయ**
**ప్రాయుంక్తతాం స్వజనరక్షణజాగరూకామ్ ।**
**త్వాం బోధయామి సదయే! హృదయే క్షమస్వ**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

తల్లీ! శ్రీహరినే నిద్రలేపి, బ్రహ్మను రక్షించమని నియోగించావు. (మధు కైటభ వధ సందర్భంలోనే). అలా నీవు నీ భక్తులను రక్షించటంలో నిత్యమూ జాగరూకవై (జాగర్త కలదానివై) వుంటావు. అలాంటి నిన్ను, ఇపుడు, నేను నిద్ర లేపుతున్నాను. దయగల తల్లీ! నీ హృదయంలో నన్ను క్షమించు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

11. **హంసీతి దేవి! నిమిషేణ సురారివర్గం**
**త్వాం వర్ణయామి నిమిషేతి నితాంతమౌఢ్యాత్ ।**
**రక్షాద్య మామనిమిషేశ్వరి! బోధయోగాత్**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఓ అనిమిషేశ్వరీ! అనిమిషులంటే దేవతలు, నీవు అనిమిషులకు రాణివి. నీవు రెప్పపాటు కాలంలో రాక్షసులందర్నీ సంహరిస్తున్నావు గనుక నిన్ను "నిమిషా" అని నాయొక్క తీవ్ర అజ్ఞానంవల్ల వర్ణిస్తున్నాను. అట్టి నన్ను జ్ఞాన యోగంతో రక్షించు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

(**గమనిక:** నిమిషము లేక నిమేషము అనేది ఇంగ్లీషు మినిటు కాదు. నిమిషమంటే రెప్పపాటు కాలం మాత్రమే. ఇది సెకండులో 16/75 వ వంతు.)

12. **సాక్షాదసీతి భజనాన్నిమిషాయతాన్మే**
**అధ్యాసపాటవవశాన్నిమిషాం బ్రువే త్వామ్ ।**
**ఉన్మేషకేలిభిరపాకురు మేఽద్య మోహం**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

అమ్మా! నేను, అధ్యాసలో వున్నవాడిని. (అధ్యాస అంటే, ఒకదాన్ని చూసి మరొకటి అనుకోవటం.) నేనేమో ఒక నిమిషం నీ భజన చేసేటప్పటికి నీవు నాకు సాక్షాత్కరిస్తున్నావు. దాంతో నాలోని అధ్యాసబలంవల్ల "నీవే నిమిషవు" అని నేనంటున్నాను. అందుచేత నాకు కళ్లు తెరిపించటమనే లీల చూపి (నీవు కళ్లు తెరవటమనే లీల చూపి) నా అజ్ఞానాన్ని ఇపుడు పోగొట్టు. నాతల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

13. **త్వం కేతి యస్తు పరిపృచ్ఛతి తీవ్రభక్త్యా**
**ద్రాక్ స్వాత్మనా స్ఫురసి తస్య విశుద్ధబుద్ధౌ ।**
**తజ్జాగృహీశ్వరి! కృపాకరి! మేఽద్య చిత్తే**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఎవడైనా సరే, తీవ్రమైన భక్తితో "నీవెవరవు?" అని నిన్ను అడిగితే, నీవు వెంటనే వాడి బుద్ధిని శుద్ధం చేసి, దానిలో వాడి ఆత్మరూపంగానే దర్శనమిస్తావు. అందువల్ల ఓ ఈశ్వరీ! కృపాకరీ! ఇపుడు నా హృదయంలో మేలుకో, నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

14. **శ్రీముక్తికర్షివిధృతే సుమనస్కయజ్ఞే**
**హంతుం రిపూన్ సపది తత్ర సమావిరాసీః ।**
**ముక్త్యున్ముఖస్య మనసః ఫలమేతదంబ!**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

శ్రీముక్తికమహర్షి రక్షణలో వున్న సుమనస్కరాజుయొక్క యజ్ఞంలో, శత్రువులైన రాక్షసులను సంహరించటానికై, తక్షణమే నీవక్కడ సాక్షాత్కరించావు. మనస్సు ముక్తికి ఉన్ముఖమైవుంటే వచ్చే ఫలమిది తల్లీ! నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

15. **సా లోకపావనగుణాపి కవేరపుత్రీ**
**తాం లోకపావననదీం మిలతి స్మ యత్ర ।**
**త్వం లోకపావనతమా ప్రకటాసి తత్ర**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఆ కావేరి సహజంగా లోకపావనములైన గుణాలు కలది. ఆమె లోకపావన నదిని కలిసింది. లోకపావనులందరిలోకీ ఉత్తమురాలవైన నీవు, వారిద్దరూ సంగమినిచిన స్థలంలోనే నిన్ను నీవు ప్రకటం చేసుకున్నావు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

16. **ద్రాగ్జానుమండలసుమండలరాక్షసఘ్నీ**
**త్వం ముక్తికాఖ్యమునిసత్తమసంస్మృతాసీః ।**
**షడ్వైరివర్గహననేన మమాద్య దుర్గే!**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

హే దుర్గే! పూర్వం ముక్తికమహర్షి నిన్ను స్మరించంగానే, వెంటనే జానుమండల, సుమండల రాక్షసులను సంహరించేశావు. ఇపుడు నాకు ఆరుగురు శత్రువులను సంహరించి, నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

17. **త్వం జానుమండలసమం స్మృతిమాత్రతస్తే**
**కృత్వా భవాబ్ధిమథ తం హరసి స్వదృగ్భిః ।**
**తజ్జానుమండలహరాసి హి లక్షణార్థాత్**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

నిన్ను స్మరిస్తే చాలు, ఈ సంసార సముద్రం మోకాలి లోతయి పోతుంది. (జానుమండలం అంత లోతవుతుంది). ఇక నువ్వు చుశావో, అది గూడా ఇంకి పోతుంది. అందువల్ల లక్షణార్థంతో నీవే "జానుమండలహరవు" అవుతున్నావు నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి. (పదానికి వున్న అర్థాన్ని ఉన్నట్లు కాకుండా, కొంచెం దాని సమీపంలో వున్నదాని అర్థం చెప్పుకోవటం పేరు లక్షణార్థం.)

18. **బ్రహ్మాండమండలనిబద్ధగతేర్జనస్య**
**త్వం సూర్యమండలవిభేదనకారయిత్రీ ।**
**మన్యే తతో౽స్తి భవతీ హి సుమండలఘ్నీ**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

జీవులకు నిరంతరము ఈ బ్రహ్మాండమండలంలో (పైకీ క్రిందికీ) తిరుగుతూ వుండటమే గతి. అలాంటి జీవికి సూర్యమండలభేదనం చేయించే దానివి నీవే! (యోగి సూర్యమండలాన్ని భేదించుకొని, బ్రహ్మలోకం చేరి, ఇక మళ్లీ తిరిగి రాడని ఉపనిషత్తులు చెపుతున్నాయి.) అందువల్లే నీవు "సుమండలఘ్ని"వి అనుకొంటున్నాను. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

19. **హృత్పుండరీకనిలయా యది పౌండరీక-**
**యజ్ఞాధికం దిశసి సత్ఫలమానతేభ్యః ।**
**ఇత్థం హి వేదమఖకృత్సుమనస్కరాజః**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

నీవు హృదయపుండరీకంలో (హృదయపద్మంలో) వుంటే, నీ భక్తులకు నీవు పౌండరీకయాగంకన్నా ఎక్కువ ఫలితాన్ని ఇస్తావు. సుమనస్కరాజు పౌండరీకయాగం చేసి, ఈ మాట తెలుసుకొన్నాడు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

20. **నిత్యం పరార్థవినియుక్తతపఃప్రభావాన్**
**తాన్ ముక్తికోపమమునీనపి దేవి! కాలే ।**
**కాలే ధ్రువం జనయసే జనరక్షణాయ**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఓ దేవీ! నీవు ఆయా కాలాలలో జనులను రక్షించేందుకోసం నిత్యమూ పరార్థం కోసమే తమ తపశ్శక్తిని వినియోగించే ఆ ముక్తిక మహర్షిలాంటి వారిని, మళ్ళీ జన్మింప చేసుకొంటూ వుంటావు. (అనగా, నీ కోసమే నీవు వారికి జన్మనిస్తావు.) ఇది నిశ్చయం. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

21. **రూపం మహాయుధధరం తవ వీక్ష్య యజ్ఞే**
**ఘోరం తదేతదితి దైత్యగణా అవోచన్ ।**
**భూషాద్భుతం తదితి సాధుగణాశ్చ చిత్రం**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

యజ్ఞ సమయంలో అనేక ఆయుధాలను ధరించి వున్న నీ రూపాన్ని చూసి, దైత్య గణాలు "ఇది ఘోర రూపం" అన్నాయి. సాధుగణాలు ఇది అలంకారాలతో ఆశ్చర్యకరంగా వుంది అన్నాయి. చిత్రమిది నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

22 **బిందుత్రికోణనిలయే! వలయైర్నవైస్తై-**
**ర్యుక్తా మదాకృతిరితీవ హి బోధయన్తీ ।**
**శ్రీచక్రమచ్ఛమకరోః ప్రకటం పురస్తాత్**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

బిందువులోనూ, త్రికోణంలోనూ వుండే నా తల్లీ! (నీవు వారిద్దరి భావాలను కాదని) "నాయొక్క రూపం నవావరణలతో కూడి వుంటుంది" అని బోధిస్తున్నావో అన్నట్లు, నీ యెదుట స్వచ్ఛమైన శ్రీచక్రాన్ని ప్రకటింప చేశావు. నా తల్లీ! నిమిషాంబా ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

23. **మందస్మితోజ్జ్వలముఖే! డమరుత్రిశూల-**
**పద్మాభయాన్వితకరేఽంబ! పురోగచక్రే! ।**
**శ్రీచక్రతస్సముదితేవ విభాసి భాసా**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

అంబా! నీ ముఖం చిరునవ్వుతో వెలిగిపోతోంది. నీ చేతులలో డమరు త్రిశూల పద్మ అభయాలున్నాయి. నీ ముందు శ్రీచక్రం వుంది. అందువల్ల నీవు కాంతి స్వరూపంతో శ్రీచక్రంనుంచీ వెలువడుతున్నట్లుగా వుంది. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

24. **శ్రీముక్తికేశ్వరవిభుః ప్రకటీకృతాం త్వాం**
**వీక్ష్య ప్రఫుల్లహృదయస్సదయప్రభావః ।**
**వామాం స్వవామనికటేఽత్రదధారధీరాం**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్**

ఇలా ప్రకటమైన నిన్ను చూసేసరికి, శ్రీముక్తికేశ్వరప్రభువుకు హృదయం వికసించింది. ఆయన సహజంగానే దయా స్వభావుడు కనుక, వామంగా వున్న నిన్ను (అందంగా వున్న నిన్ను), తన వామ భాగంలో (ఎడమ భాగంలో) నిలిపేశాడు. నీవు ధీరవు. (తొట్రుబాటులేని దానివి కనుక అక్కడే నిలిచిపోయావు.) నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

25. **దాంపత్యసాధనకృతే యువయోస్తు లక్ష్మీ-**
**నారాయణోఽస్తి పటురేక ఇహాదిమూర్త్యోః ।**
**తతోఽయమస్తి యువయోః కిల దక్షభాగే**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఆదిమూర్తులైన మీ యిద్దరికీ దాంపత్యం కలిగించాలంటే, దానికి సమర్థుడు లక్ష్మీనారాయణుడొక్కడే. అందుచేత ఆయన మీ యిద్దరికి కుడి-భాగాన ఇక్కడే వుండిపోయాడు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

26. ***గంజాంపురేశ్వరి! గణేశ్వర వాయుపుత్రౌ***
**త్వద్గేహసీమ్ని భజత స్సతతాభిముఖ్యమ్ ।**
**దాతుం శుభాని చ భవత్పదసేవకానాం**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

ఓ గంజాంపుర రాణీ! గణపతి హనుమంతులిద్దరూ నీ యింట్లో నీకు ఎప్పుడూ అభిముఖంగా వున్నారు. (ఎదురుగా, అనుకూలంగా వున్నారు.) వారు నీ పాదసేవ చేసేవారికి శుభాలివ్వటానికి అలా వున్నారు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

27. **చాముండికా నికటగాచలమస్తకేఽసి**
**దూరస్థ శృంగశిఖరేఽసి చ శారదాంబా ।**
**ఏకా త్వమేవ బహురూపతతా బహుత్ర**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

దగ్గర వున్న కొండమీద చాముండీ దేవిగా వున్నావు. దూరంగా వున్న శృంగ పర్వతంమీద శారదాంబగా వున్నావు. నీవు ఒకతెవే అనేక చోట్ల, అనేక రూపాలుగా, విస్తరించి వున్నావు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

28. **యా భూపుర ప్రభృతి మోదమయాన్తిమేషు**
**దేవ్యో లసన్తి వలయేశ్వరి! యే చ దేవాః ।**
**తే తా ఇహాద్య విలసన్తి నిరీక్షమాణాః**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

హే నవావరణేశ్వరీ! శ్రీచక్రంలో భూపురం దగ్గరనుంచీ సర్వానందమయ చక్రమనబడే బిందువు వరకూ ఏ యే దేవులు, దేవీలు వున్నారో, వారంతా ఇపుడిక్కడ నీ కోసం నిరీక్షిస్తున్నారు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

29. **యే సేతుశీతనగమధ్యగతాస్సురేశాః**
**యే వా ధ్రువద్వితయమధ్యగజీవినశ్చ ।**
**తేషాం శుభాని విభవాని విధాతుమీశే!**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

రామేశ్వరంనుంచీ హిమాలయంవరకూ యే యే దేవతలున్నారో, ఉత్తర దక్షిణ ధ్రువాల మధ్యలో యేయే జీవులున్నారో, వారందరికీ శుభాలను, వైభవాలనూ కలిగించటం కోసం, ఓ ఈశ్వరస్వరూపిణీ! నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

30. **శ్రీముక్తికేశ్వరమనోహరి! గౌరి! లక్ష్మీ-**
**నారాయణ ప్రియసహోదరి! దివ్యనారి!**
**త్వం జాగృహీష్టకరి! జాగరయాపిచాస్మాన్**
**కుర్యా మదంబ! నిమిషాంబ! శుభప్రభాతమ్ ॥**

శ్రీముక్తికేశ్వరుని మనసు దోచినదానా! గౌరీ (తెల్లనిదానా!) లక్ష్మీ-నారాయణుని ప్రియసోదరీ! ప్రకాశించే నారీ! (దేవతా స్త్రీ!) వరాలిచ్చే తల్లీ! నీవు మేలుకో, మమ్మల్ని గూడా మేలుకొలుపు. నా తల్లీ! నిమిషాంబా! ఈ ప్రభాతాన్ని శుభప్రభాతంగా చెయ్యి.

## స్తోత్రం

1. **సుమమాలిని! శంకరమోంకురుషే**
**ద్యుతిశాలిని! తుష్యసి సత్పురుషే ।**
**జయ శూలిని! తత్సుఖమాతనుషే**
**నతపాలిని! పాలయ శ్రీనిమిషే!**

పుష్పమాలికలు ధరించిన తల్లీ! నీవు శంకరుని అంగీకరిస్తున్నావు. (శంకరుని గూర్చి ఓంకారం చేస్తున్నావు) ఓ తేజశ్శాలినీ! నీవు సత్పురుషుల పట్ల సంతోష పడుతున్నావు. (సత్స్వరూపుడైన పరమపురుషునియందు ఆనందం పొందుతున్నావు) ఓ శూలినీ! నీకు జయము! నీవు వారికి సుఖం కలిగిస్తున్నావు. ఓ భక్త పాలినీ! శ్రీనిమిషాదేవీ! నన్ను రక్షించు.

2. **పరిపాసి నతం కృపయా నిమిషే**
**పృథ తం పరిపాతయసే న మిషే ।**
**నిజబోధనయాపిచ సమ్మనుషే**
**నతపాలిని! పాలయ శ్రీనిమిషే!**

నీవు భక్తుడ్ని నిమిషంలో రక్షిస్తావు. ఇక అతడ్ని మిషలో (నెపంలో) పడవేయవు. అంతేగాక, అతనిని ఆత్మబోధచేత సత్కరిస్తావు. ఓ భక్తపాలినీ! శ్రీనిమిషాంబా! నన్ను రక్షించు.

3. **స్పృహయస్యఖిలేశ్వరి! సద్ధవిషే**
**క్రతురీతిషు పాలితముక్తఋషే!**
**సుమనస్కశుభంకరి! నష్టరుషే!**
**నతపాలిని! పాలయ శ్రీనిమిషే!**

హే అఖిలేశ్వరీ! నీవు యజ్ఞంలో సత్పురుషులిచ్చే హవిస్సుల కోసం (హోమద్రవ్యాలకోసం), ఎదురు చూస్తూ వుంటావు. నీవు ముక్తకఋషిని రక్షించావు. సుమనస్కుడికి శుభం కలిగించావు. నీవు రోషం వదిలిన దానివి. ఓ భక్తపాలినీ! శ్రీనిమిషాంబా! నన్ను రక్షించు.

4. **ముహురంబ! నమస్సతి! తే వపుషే**
**ప్రణవాంచిత సజ్జన ధీ ధనుషే ।**
**పరసంవిదమీశ్వరి! సంచినుషే**
**నతపాలిని! పాలయ శ్రీనిమిషే!**

ఓ సతీ! (పతివ్రతా! ఓ సత్పదార్థమా!) నీ శరీరాన్ని (రూపాన్ని) ధ్యానించిన సజ్జనుల మనస్సుల్లో ఆ రూపం ప్రణవాన్ని సంధిస్తుంది. అట్టి నీ శరీరానికి మళ్ళీ మళ్ళీ నమస్కారం తల్లీ! ఓ ఈశ్వరీ! నీవు పరమజ్ఞానాన్ని (భక్తులలో) వృద్ధి పరుస్తున్నావు. ఓ భక్తపాలినీ! శ్రీనిమిషాంబా! నన్ను రక్షించు.

5. **జయ గంజపురీశ్వరి! మంజుగతే!**
**జయ రంజితశంకరి! పింజసితే!**
**జయ వంజులనీపనికుంజరతే!**
**నతపాలిని! పాలయ శ్రీనిమిషే!**

ఓ గంజాంపురీశ్వరీ! నీ నడక అందమైనది. జయించు. నీవు శంకరుని రంజింప చేశావు. నీవు దూదివలె తెల్లని దానవు. జయించు. నీవు అందమైన కదంబ వృక్షాల గుబురుల్లో ఆసక్తి కలదానవు. జయించు. ఓ భక్తపాలినీ! శ్రీనిమిషాంబా! నన్ను రక్షించు.

6. **జయ భండవిఖండనచండతరే!**
**జయ భండనపండితదండధరే!**
**జయ పండితమండనశౌండకరే!**
**నతపాలిని! పాలయ శ్రీనిమిషే!**

భండాసురుని సంహరించటంలో భయంకరమైనదానా! జయించు. యుద్ధంలో నేర్పరి అయిన దండం కలదానా! జయించు. పండితులను గౌరవించటంలో ప్రసిద్ధి చెందిన చెయ్యికలదానా! జయించు. ఓ భక్తపాలినీ! శ్రీనిమిషాంబా! నన్ను రక్షించు.

7. **జయ కింకరశంకరి! పంకహరే!**
**జయ శంకరసంకరితాత్మరుచే!**
**జయ సంకటటంకనటంకనిభే!**
**నతపాలిని! పాలయ! శ్రీనిమిషే!**

దాసులకు శుభాలు కలిగించేదానా! పాపాలను సంహరించే దానా! జయ. శంకరునితో సంకరమైపోయిన శరీరకాంతి కలదానా! జయము. సంకటాలను ఖండించటంలో ఉలి వంటిదానా! జయము. ఓ భక్తపాలినీ! శ్రీనిమిషాంబా! నన్ను రక్షించు.

8. **విపులోజ్జ్వలపావనభావపుషా**
**పురతో మమ సంస్ఫురపుణ్యపుషా ।**
**కురు వర్జితమీశ్వరి! మాం జనుషా**
**నతపాలిని! పాలయ శ్రీనిమిషే!**

ఓ ఈశ్వరీ! పుణ్యాలను పోషించేదీ, విపులమైనదీ, పవిత్రమైనదీ అయిన తేజశ్శరీరంతో నా యెదుట సాక్షాత్కరించు. నన్ను జన్మలేని వాడినిగా చెయ్యి. ఓ భక్తపాలినీ! శ్రీనిమిషాంబా! నన్ను రక్షించు.

9. **శతసోమసుశీతలమీశ్వరి! తే**
**దిశ పాదముమే! మమ మూర్ధ్ని శుభే!**
**అథ దర్శయ తే పదమద్వితయే!**
**నతపాలిని! పాలయ శ్రీనిమిషే!**

ఓ ఈశ్వరీ! ఓ శుభప్రదురాలా! వంద చంద్రుల వలె చల్లని నీ పాదాన్ని నా తల మీద వుంచు. ఓ అద్వితీయురాలా! ఇక నీ స్థానాన్ని చూపించు. ఓ భక్తపాలినీ! శ్రీనిమిషాంబా! నన్ను రక్షించు.

## ప్రపత్తి

1. **శ్రీచక్రస్య సమీపభూమినిలయాం శ్రీముక్తికేశప్రియాం**
**మౌనిధ్యేయమనోజ్ఞదీప్తివలయాం మౌర్ఖ్యాపహారోదయామ్ ।**
**నిత్యస్థాపితముక్తికర్షివిజయాం నిర్వేలభాస్వద్దయాం**
**వందేఽహం నిమిషాంబికాం హతభయాం వందారుభక్తాశ్రయామ్॥**

శ్రీచక్రం దగ్గర వెలసి వున్నది, శ్రీముక్తికేశ్వరునకు భార్యయు, మునులు ధ్యానించదగిన సుందరమైన కాంతివలయములు కలిగినదియు, తనయొక్క సాక్షాత్కారముచే మూర్ఖత్వమును పోగొట్టునదియు, ముక్తిక మహర్షికి నిత్యము విజయములను కలిగించునట్టిదియు, అవధిలేని దయకలిగినట్టిదియు, భయమును పోగొట్టునట్టిదియు, సేవించే భక్తులకు ఆశ్రయమైనట్టిదియు, అగు నిమిషాంబికకు వందనము చేయుచున్నాను.

2. **గంజాంపురేశ్వరి! మహేశ్వరచిత్తచోరే!**
**గంజాస్యహో మదనజేతురపాంగపంక్తేః ।**
**గంజోఽపి చాసి నమతాం సకలార్థదాత్రీ**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఓ గంజాంపురేశ్వరీ! నీవు మహేశ్వరుడి చిత్తాన్ని దొంగిలించావు. నీవు ఆ మన్మథజేతయొక్క ఓర చూపులకు మద్యశాలవు. (గంజా = మద్యశాల) అంతే కాదు. నీవు భక్తులకు అన్ని పురుషార్థాలనూ ఇచ్చే నిధివి. (గంజః = నిధి) తల్లీ! అట్టి నీ చరణాలను శరణు పొందుతున్నాను.

3. **యే మానవా నవనవోన్మిషదాత్మశీలా**
**శీలైకతానచరితా చరితోరుధర్మాః ।**
**తేషాం త్వమంబ! నిమిషాంబ! పరార్థదాత్రీ**
**మాతస్త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥**

ఏ మానవుల బుద్ధి నవనవంగా వికసిస్తూ వుంటుందో, ఎవరికి సచ్ఛీలమే చరిత్రగా వుంటుందో, ఎవరు ధర్మమే ఆచరిస్తారో, అంబా! నిమిషాంబా! నీవు వారికి అనంత సంఖ్యలో కోరికలు తీరుస్తావు. పరమపురుషార్థాన్ని ఇస్తావు. తల్లీ! అట్టి నీ చరణాలను శరణు పొందుతున్నాను.

4. **శ్రీరంగపట్టణసమీపసరిత్సమాజే**
**వ్యక్తా త్వమంబ! కతమేతి లఘూక్తిరేషా ।**
**కా న త్వమిత్యుచితసూక్తిరియం బుధానాం**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

అంబా! శ్రీరంగపట్టణ సమీపంలో,నదుల సంగమంలో వెలసిన నువ్వెవరివి? అనేది తేలిక మాట. "నువ్వేవరివి కాదు?" అనేది పండితులు పలికే సముచిత సూక్తి. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

5. **త్వం కాలపాక పరిజర్ఝతాండభాండా**
**సృష్టిస్థితిప్రలయతాండవపండితా చ ।**
**తత్కాలికాసి నిమిషాంబ! నిషత్సు గీతా**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

(ఇక పదిశ్లోకాలలో దశ మహావిద్యాస్వరూపిణిగా
శ్రీనిమిషాంబను స్తుతిస్తున్నారు-)

ఓ నిమిషాంబా! నీవు కాలమనే పాకంలో పెట్టి ఈ బ్రహ్మాండ భాండాలను వుడికించి వేస్తూ వుంటావు. సృష్టి స్థితి ప్రళయాలనే తాండవంలో నీవు పండితురాలివి (ఈ లక్షణాలు కాళికాదేవికే వున్నాయి.) అందువల్ల ఉపనిషత్తులు చెప్పిన కాళికవు నీవే. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

6. **త్వం శబ్దశక్తిరఖజా ప్రణవాభిధానా**
**వేదప్రసూర్భవమహాంబుధి తారయిత్రీ ।**
**తారా తతోఽసి నిమిషేఽక్షరహృద్యవిద్యా**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఓ నిమిషాదేవీ! నీవు అకాశంలోంచి పుట్టని శబ్దశక్తివి. నీ పేరు ప్రణవం. నువ్వు వేదాలకు తల్లివి. సంసారసాగరాన్ని తరింపజేసే దానివి. నీవు అక్షరమైన, హృద్యమైన విద్యవు. అక్షరములనే హృద్యమైన విద్యవు కూడా. ఈ లక్షణాలవల్ల నీవే తారాదేవివి. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

7. **హృన్నేత్ర శీర్ష పురవాసిని! బోధరూపే!**
**సూర్యేందువహ్నిపురగే! నిమిషాంబ! విజ్ఞాః ।**
**త్వామబ్రువన్ త్రిపురసుందరి! సుందరీతి**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఓ నిమిషాంబా! నీవు జ్ఞానరూపిణివై హృదయము,నేత్రము, శిరస్సు అనే మూడు పురాలలోనూ, అలాగే సూర్యుడు, చంద్రుడు, అగ్ని అనే మూడు పురాలలోనూ నివసిస్తూ వుంటావు. అంతే గాక నీవు సుందరివి (అనందరూపిణివి.) అందువల్ల విజ్ఞులు నిన్ను త్రిపురసుందరీ అన్నారు. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

8. **ఈక్షామయాసి పరమాంబరరూపిణీ త్వం**
**శక్తిత్రయాశ్రయధరాస్యదితిస్తథా త్వమ్ ।**
**తస్మాత్త్వమేవ నిమిషే! భువనేశ్వరీ స్యాః**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

పరమాత్మయొక్క ప్రథమ సంకల్పం పేరు ఈక్ష. ఆ ఈక్షయే చిదాకాశం. అదే సృష్టిలో చోటు (ప్రదేశం). అది నువ్వే. ఆ ఈక్షయే మూడు శక్తులుగా మారింది. (ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులుగా మారింది.) ఆ మూడు శక్తులకు ఆశ్రయమైన దేవిని అదితి అంటారు. ఆ అదితివి నీవే. ఈ లక్షణాలవల్ల నీవు భువనేశ్వరీ దేవివి అవుతున్నావు. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

9. **యా మూలపద్మ దృఢభావనయాభిగమ్యా**
**స్వాహాస్వధాపదనుతా పరమా చ యా వా ।**
**సా భైరవీ త్వమసి హే నిమిషే! ప్రసీద**
**మాతస్త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥**

మూలాధారపద్మంలో దృఢమైన ఉపాసన చేస్తే, భైరవీ దేవి సాక్షాత్కరిస్తుంది. ఆమెనే దేవలోకంలో స్వాహా అనీ, పితృలోకంలో స్వధా అనీ, కీర్తిస్తారు. ఓ నిమిషాదేవీ! సర్వోన్నతురాలైన ఆ భైరవీదేవివి నీవే. అనుగ్రహించు. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

10. **యా స్వీయమస్తకకపాలవిభేదగమ్యా**
**యా దేవయానపదవీ చ విరోచనీ యా ।**
**సా త్వం ప్రచండపదపూర్వకచండికాసి**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

సాధకుడు తన తలలో వుండే డిప్పలను రెండింటినీ విడదీసే సాధన చేస్తే, ప్రచండచండిక సాక్షాత్కరిస్తుంది. ఆమె దేవయానమనబడే పాలపుంతలో వుంటుంది. అక్కడ ఆమెను విరోచనాదేవి అని పిలుస్తారు. ఆ ప్రచండ చండికవు నీవే. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

11. **నిద్రా జగత్ప్రలయగాపిచ యోగనిద్రా**
**యా రాత్రిశబ్దవిదితాపిచ లోకనిద్రా ।**
**ధూమావతీ త్వమసి సా నిమిషాంబ! నూనం**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

నిద్ర మూడు రకాలు. ఒకటి, జగత్ప్రళయాన్ని కలిగించే నిద్ర. రెండు, యోగుల యోగనిద్ర. మూడు, లోకంలో అందరూ పోయే నిద్ర. దీని పేరే రాత్రి. ఈ నిద్రా దేవతయే ధూమావతీదేవి. ఓ నిమిషాంబా! నీవే నిశ్చయంగా ఆ ధూమావతీ దేవివి. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

12. **యా స్తంభనే సునిపుణా షడరివ్రజస్య**
**యాధిష్ఠితా చ పితృయానమథేంద్రయోనిమ్ ।**
**సైవాంబ! దేవి! నిమిషే! బగళాముఖీ త్వం**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

బగళాముఖీదేవి అరిషడ్వర్గాలను స్తంభింప జేయటంలో నేర్పరి. ఆమె పితృయానమనబడే ఇడానాడిలోనూ, ఇంద్రయోని అనబడే కొండనాలికలోనూ, నివసిస్తుంది. అంబా! నిమిషాదేవీ! అట్టి బగళాముఖివి నీవే. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

13. **వ్యక్తోంకృతిస్వరమయీ రవవైఖరీ యా**
**యస్యాస్తు దైవతమభూదథ మంత్రిణీడ్యా ।**
**మాతంగికా త్వమసి సా నిమిషేఽభ్రతుంగే!**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఓంకారం వ్యక్తంగా వున్నప్పుడు, శబ్దం వైఖరీశబ్దంగా వున్నప్పుడు, వాటిని మాతంగీ దేవత అంటారు. ఆమెకు అధిదేవత పూజ్యురాలైన మంత్రిణి (శ్యామలాదేవి). ఆమె ఆకాశంకంటే ఎత్తైనది. ఓ నిమిషాదేవీ! ఆ మాతంగివి నీవే. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

14. **యా కామనావిరహితైరథ మోక్షకామైః**
**శ్రీకామనైరపి హృదంబుజ పీఠసేవ్యా ।**
**సా శ్రీంగృహాసి నిమిషే! కమలాంబికా త్వం**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

కోరికలు ఏమీ లేనివారు, మోక్షాన్ని మాత్రమే కోరేవారు, ఐశ్వర్యాన్ని కోరేవారు, ఎవరైనా సరే, హృదయపద్మంలో ధ్యానం నిలిపితే, కమలాంబికా దేవి సాక్షాత్కరిస్తుంది. ఆమెకు శ్రీంకారమే గృహం. ఓ నిమిషాదేవీ! ఆ కమలాంబికవు నీవే. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

15. **విద్యాభిరంబ! దశభిః ప్రతిపాదితా త్వం**
**మంత్రైర్మహేశి! శతధా ప్రవిబోధితా త్వమ్ ।**
**శబ్దైస్తథార్థవలితైస్తు సహస్రధా త్వం**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

అంబా! ఈ విధంగా దశమహావిద్యలచేత ప్రతిపాదించబడిన దేవతవు నీవే. ఓ మహేశీ! మహామంత్రాలన్నీ వందల రీతులుగా బోధించేది నిన్నే. అర్థంగల శబ్దాలు వేల రీతులుగా పల్కేది నిన్నే. తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

16. **సా త్వం మదంబ! జగదంబ! కదంబగేఽంబ!**
**సర్వార్థగేఽంబ! హృదయే మమ సాంబగేఽంబ**
**నిత్యం స్ఫురాంబ! దిశ మేఽంబ! కరావలంబం**
**మాతస్త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ॥**

నా తల్లీ! జగదంబా! కదంబ వృక్షాలలో వుండే తల్లీ! సర్వపదార్థాలలోనూ వుండే తల్లీ! నా హృదయంలో నిత్యమూ స్ఫురించవమ్మా! నాకు చేయూత ఇవ్వమ్మా! తల్లీ! అట్టి నీ పాదాలను శరణు పొందుతున్నాను.

# మంగలమ్

1. **ఉన్మేషకల్పితాండాయై**
**నిమేషధ్వస్తసృష్టయే ।**
**నిమేషోన్మేషదూరాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

రెప్పలు తెరవటంవల్ల బ్రహ్మాండాలను కల్పించేదానివీ, రెప్పపాటువల్ల సృష్టిని సంహరించేదానివీ, రెప్పల తెరుపుకూ, మూతకూ దూరంగా వున్నదానివీ, అయిన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

2. **అనిమేషవరిష్ఠాయై**
**నిమేషాత్కరుణాకృతే ।**
**ఇత్థం విచిత్రధర్మాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

అనిమేషులలో (రెప్పపాటు లేని దేవతలలో) శ్రేష్ఠురాలివీ, నిమిషంలో కరుణ చూపేదానివీ, ఇలా విచిత్రమైన గుణాలు కలదానివీ, అయిన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

3. **భుక్తిదాత్రీ భక్తిగాత్రీ**
**త్యక్తభేదాస్యసక్తిదా ।**
**యుక్తయోగా ముక్తధీగా**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

నీవు భుక్తి ఇస్తావు. భక్తియే నీ శరీరం. నీకు భేదాలు లేవు. వైరాగ్యాన్నిస్తావు. యోగాన్ని కూరుస్తావు. ముక్తులైన వారి మనస్సుల్లో వుంటావు. ఓ నిమిషాంబా! నీకు మంగళం.

4. **గర్గగీర్గా స్వర్గమార్గా**
**త్వం స్వర్గాపవర్గదా ।**
**త్వం దుర్గా భర్గపూర్గాసి**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

నీవు గర్గమహర్షియొక్క వాక్కులలో వున్నావు. స్వర్గానికి మార్గం నీ అధీనంలో వుంది. నీవు నీవారికి మోక్షం ఇస్తావు. దుర్గవు నువ్వే. శివుని శరీరంలో వున్నది నువ్వే. ఓ నిమిషాంబా! నీకు మంగళం

5. **సుమంత్రా త్వం సుయంత్రా త్వం**
**సుతంత్రా త్వం స్వయంత్రితా ।**
**అతంత్రా చ స్వతంత్రా చ**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

నీవు మంచి మంత్రాలు కలదానివి. నీవు మంచి యంత్రాలు కలదానివి. నీవు మంచి తంత్రాలు కలదానివి. నిన్ను నియంత్రణ చేసుకొనే దానివి నీవే. నీకు ఏ శాస్త్రమూ లేదు. నీవు స్వతంత్రురాలవు. ఓ నిమిషాంబా! నీకు మంగళం.

6. **శివానీ త్వం భవానీ త్వం**
**శర్వాణీ త్వం సుపావనీ ।**
**రుద్రాణీ త్వం తథేశానీ**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

నీవు శివానివి, భవానివి, శర్వాణివి, పావనివి, రుద్రాణివి, ఈశానివి. ఓ నిమిషాంబా! నీకు మంగళం.

7. **సంధ్యాత్రయ నిషేవ్యాయై**
**సర్వసంధిస్థిరాత్మనే ।**
**గాయత్రీమంత్రవేద్యాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

మూడు సంధ్యలలోనూ ఉపాసింపదగిన దానివి, అన్ని రకాల వస్తువుల సంధులలోనూ స్థిరంగా వుండే దానివి, గాయత్రీ మంత్రం చేత తెలియదగిన దానివి, అయిన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

8. **జ్ఞానశక్తిస్వరూపాయై**
**సవితుః ప్రియభర్గసే ।**
**ధీచోదయిత్ర్యై సావిత్ర్యై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

జ్ఞాన శక్తియే స్వరూపంగా కల దానివి, సవితయొక్క ప్రీతికరమైన తేజస్సువి, అందరి బుద్ధులను ప్రేరేపించే దానివి, సావిత్రీ రూపురాలివి, అయిన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

9. **ఆదిత్యమండలస్థాయై**
**హిరణ్మయసుమూర్తయే ।**
**వేదసారస్వరూపాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

ఆదిత్య మండలంలో హిరణ్మయ పురుష స్వరూపంగా వుండే దానివి. వేదములయొక్క సారమే స్వరూపంగా కలదానివి. అయిన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

10. **యోగేన ధీనిరోధేన**
**తపసాఽఽలోచనేన చ ।**
**ఉపాసనేన గమ్యాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

చిత్తవృత్తి నిరోధమే యోగం. (ఒకే వృత్తిని గూర్చిన) ఆలోచనమే తపస్సు. ధ్యేయవస్తువుయొక్క సాన్నిధ్యాన్ని అనుభవించటమే ఉపాసన. ఈ మూడిటిచేత పొందదగిన దానివైన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

11. **మూలాచ్ఛిరః ప్రయాతాయై**
**శిరసో హృచ్చ సంతతమ్ ।**
**యోగశక్తిస్వరూపాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

మూలాధారంనుంచీ సహస్రారానికీ, అక్కడనుంచీ హృదయానికీ, అవిచ్ఛిన్నంగా ప్రవహించే యోగశక్తి స్వరూపురాలైన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

12. **సమష్ట్యకామసత్కర్మ-**
**ఫలపుంజైకమూర్తయే ।**
**శ్రీదేవతాస్వరూపాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

నిష్కామ కర్మలు చేసేవారియొక్క సమష్టి పుణ్య ఫలరాశియే శ్రీ దేవత. అట్టి శ్రీదేవతారూపిణివైన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

13. **అజే వాణీస్వరూపాయై**
**విష్ణౌ లక్ష్మీతనూధృతే ।**
**శివే శివాయై నిత్యాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

బ్రహ్మయందు సరస్వతీరూపంగానూ, విష్ణువునందు లక్ష్మీరూపంగానూ, శివునియందు శాశ్వతమైన శివాస్వరూపంగానూ వున్న ఓ నిమిషాంబా! నీకు మంగళం.

14. **సీతాయై పతిదేవాయై**
**రుక్మిణ్యై ప్రేమమూర్తయే ।**
**గౌర్యై తపోఽవతారాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

పతివ్రత అయిన సీతగానూ, ప్రేమమూర్తి అయిన రుక్మిణిగానూ, అవతరించిన తపస్సే అయిన గౌరిగానూ, వున్న ఓ నిమిషాంబా! నీకు మంగళం.

**15.** **సృష్టేః క్షేత్రస్వరూపాయై**
**తత్పోషణకృతే పి**
**మాత్రే సర్వాదిదేవాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

ఈ సృష్టి అనే పంటకు పొలం వంటిది, ఆ సృష్టిని పోషించేది, అందరికీ తల్లీ, అందుకనే అందరికీ మొదటి దైవము, అయిన ఓ నిమిషాంబా! నీకు మంగళం.

16. **ఆద్యేక్షావ్యక్తనభసే**
**ఆద్యన్తాపేతవృత్తయే ।**
**ఆద్యన్తమధ్యవ్యక్తాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

తన మొదటి సంకల్పంచేత ఆమె ఆకాశాన్ని (అంటే ఖాళీ చోటును) వ్యక్తం చేసింది. ఆమె సత్తకు మాత్రం ఆద్యంతాలు లేవు. ఆది అంత మధ్యాలు మూడిటిలోనూ ఆమె వ్యక్తమౌతూ వుంటుంది. లేదా, ఆద్యాంతాలయొక్క మధ్యలో ఆమె వ్యక్తమౌతూ వుంటుంది. అట్టి ఓ నిమిషాంబా! నీకు మంగళం.

17. **వాయువత్ ఖే ప్రపూర్ణాయై**
**గతిమత్యై చ వీచివత్ ।**
**ప్రాణస్పందస్వరూపాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

ఆమె వాయువు లాగా ఆకాశంలో నిండివుంది. (నిండి వున్నదానికి కదలిక వుండే వీలు లేదు, కానీ) ఆమెకు తరంగాల వంటి గమనం వుంది (తరంగంలో ఎక్కడి అణువులు అక్కడే పైకీ కిందకీ కదులుతూ వుంటాయి. కానీ, తరంగం ముందుకు పోతున్నట్లుగా భ్రాంతి కలుగుతుంది.) ప్రాణంయొక్క స్పందన కూడా ఇటువంటిదే. అట్టి ప్రాణస్పందనే రూపంగా గల ఓ నిమిషాంబా! నీకు మంగళం.

18. **పంచేషుసుదశే! పంచ -**
**దశి! పంచాస్య వల్లభే!**
**పంచాస్యగే! ప్రపంచేశి!**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

నీవు మన్మథునికి శుభదశవు. నీవు పంచదశీ విద్యవు. నీవు శివుని పత్నివి. సింహవాహినివి. నీవు ప్రపంచానికి ఈశివి. అట్టి ఓ నిమిషాంబా! నీకు మంగళం.

19. **త్వం పూర్ణపురుషార్ధాసి**
**పురుషార్థప్రదా నృణామ్ ।**
**పురి శేషే పూరుషాణాం**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

నీవు పూర్ణపురుషుడు అయిన శివునిలో సగానివి (అనగా నీవు కూడా పూర్ణ స్వరూపురాలివే). నీవు మానవులకు పురుషార్థాలిచ్చేదానివి. జీవుల శరీరంలో శయనించి వుండేదానివి. అట్టి ఓ నిమిషాంబా! నీకు మంగళం.

20. **మాతాసి త్వం పితాసి త్వం**
**గురుమూర్తిస్స్వయం శివే! ।**
**జన్మవిద్యామోక్షదాయై**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

ఓ శివా! నీవే స్వయంగా తల్లివి, తండ్రివి, గురువువు, నీవే వరుసగా జన్మను, విద్యను, మోక్షాన్ని ఇచ్చే దానివి. అట్టి ఓ నిమిషాంబా! నీకు మంగళం.

21. **సుమంగలి! సమాంగల్యే**
**నర్గలే! సర్వమంగలే!**
**త్వం మంగలా మంగలానాం**
**నిమిషే! తేఽస్తు మంగలమ్ ॥**

ఓ మంగళ సూత్రంగల సుమంగళీ! అడ్డంకులు లేనిదానా! ఓ సర్వమంగళా! నీవు మంగళాలకే మంగళానివి. అట్టి ఓ నిమిషాంబా! నీకు మంగళం.

# కీర్తన

మాయామాళవగౌళరాగం ఆది తాళం(2కళ చౌకం)

పల్లవి: శ్రీనిమిషాంబా శ్రీనిమిషాంబా
శ్రీశ్రీర్దిశతు మంగలమ్ ॥శ్రీ॥

అనుపల్లవి: శ్రీదా శ్రీపా శ్రీశా శ్రీగా మంగలం మంగలమ్

చరణం:1. గంజాంవాసిని! కావేరీతట-
శ్రీముక్తేశ్వరధీవిభవే!
చామరచలనైర్వాణీ లక్ష్మీ-
స్త్వాం కిల వీజయతోఽంబ! శివే! ॥శ్రీ॥

చరణం:2. అరుణసువర్ణా భవతీ ధ్యానా-
దుజ్జ్వలకవితాం నర్తయసి
చంద్రసితా త్వం ధ్యాతా రసనా-
రంగే నర్తసి స్వయమేవ ॥శ్రీ॥

చరణం:3. అమృతరసాత్మక కిరణోదారా
శమయసి గరలం రోగం చ
చంద్రకలా త్వం విద్యుద్రూపా
శిరసి సుధాప్లుతిమాతనుషే ॥శ్రీ॥

చరణం:4. త్వత్సేవారతసురతతిరేషా
త్వన్నతకామాన్ పూరయతే
త్వత్పదయుగలీ త్వదపాంగోఽయం
నిత్యానందం దిశతి సదా! ॥శ్రీ॥

## (తాత్పర్యం)

**పల్లవి:** లక్ష్మికి లక్ష్మి అయిన శ్రీనిమిషాంబ మంగళాలను ఇచ్చుగాక!

**అనుపల్లవి:** శ్రీని ఇచ్చేది, శ్రీని పాలించేది, శ్రీకి అధిపతి, శ్రీని పొందేది అయిన నిమిషాదేవి మంగళాలను ఇచ్చుగాక!

**చరణం: 1**.

ఓ గంజాం నివాసినీ! అంబా! శివా! కావేరీతీరంలోగల శ్రీముక్తికేశ్వరుని బుద్ధికి వైభవమైనదానా! లక్ష్మీసరస్వతులు చామరాలు వూపుతూ నీకు విసురుతున్నారు.

**చరణం: 2.**

ఎఱ్ఱని రంగుగల నిన్ను ధ్యానించినవారికి, నీవు శృంగారమయమైన కవిత్వాన్ని చిందులు తొక్కిస్తావు. చంద్రునివలె తెల్లగా వున్న నిన్ను ధ్యానిస్తే, నీవే స్వయంగా అతడి జిహ్వారంగం మీద నాట్యం చేస్తావు.

**చరణం: 3.**

అమృతమయమైన కిరణాలతో ఉదారంగా వుండే నిన్ను ధ్యానిస్తే, నీవు విషాలను, రోగాలను శమింప చేస్తావు. నీవు చంద్రకళా రూపంగానూ, మెరుపు రూపంగానూ, శిరస్సులో అమృత ప్రవాహాన్ని పెంపొందిస్తున్నావు.

**చరణం: 4.**

నీ సేవ యందు ఆసక్తిగల ఈ దేవతలు నీ భక్తుల కోరికలను తీరుస్తున్నారు. నీ పాద ద్వంద్వము, నీ అపాంగ వీక్షణాలు, భక్తులకు నిత్యానందాన్ని ఎల్లప్పుడూ ఇస్తున్నాయి.